# సాహిత్యం - చరిత్ర



సాహిత్యాన్ని కేవలం ఒకే కోణంలోనే కాకుండా వివిధ శాస్త్రాల అన్వయంతో అధ్యయనం చేసే ప్రాముఖ్యాన్ని 'అధ్యయనం' గుర్తించింది. ఇందులో భాగంగానే గతంలో 'సాహిత్యం – తత్త్వశాస్త్రం' అనే అంశంపై ఒక కార్యక్రమాన్ని నిర్వహించింది. అదే మార్గంలో ఇప్పుడు 'సాహిత్యం – చరిత్ర' అనే అంశంపై ఒక కార్యక్రమాన్ని చేయాలని 'అధ్యయనం' భావిస్తోంది. చరిత్ర అంటే కేవలం అక్షరాల, అంకెల సమాహారం మాత్రమే కాదు. అది గతకాలపు మన నడవడిక. మంచి – చెడు, సుఖం – దుఃఖం ఇలా సమస్త మానవ చలన జీవన దృశ్యం. గతకాలంలోని మనుషుల, కుటుంబాల మరియు సమాజాల స్థితిగతుల్ని, వారి కార్యకలాపాల్ని పరిశీలించడం చరిత్రగా చెప్పుకోవచ్చు. వ్యష్టిగా ఉన్న వ్యక్తి కుటుంబమై, ఆ కుటుంబం సమాజమై, ఆ సమాజ పోకడ ఒక చరిత్రగా అవతరిస్తుంది. ఆయా కాలాల సంఘటనల ప్రతిరూపం చరిత్ర. ఆయా కాలాల్లో సంభవించిన విప్లవాత్మకమైన, గుణాత్మకమైన సంఘటనల్ని కవి, రచయిత తన రచనలో కొద్దో గొప్పో నిక్షిప్తం చేస్తాడు. ఎందుకంటే రచయిత సంఘజీవి. తను నివసిస్తున్న సమాజాన్ని దాటుకొని అతను రచనలు చెయ్యలేడు. సమాజ సాహిత్యాలు పరస్పరాశ్రితాలు. సమాజ చలనాన్ని అక్షరబద్ధం చేసేది సాహిత్యం కనుకనే సమాజ దర్పణంగా సాహిత్యాన్ని పండితులు అభివర్ణించారు. కనుక సాహిత్యం, చరిత్ర రచనకి ఒక ఆకరంగా ఎలా తోడ్పడుతుంది, సాహిత్యాన్ని చారిత్రక దృక్పథంతో ఎలా అధ్యయనం చెయ్యాలి, అసలు సాహిత్యాన్ని చారిత్రక దృష్టితో చూడాల్సిన అవసరం ఏమిటి అన్న విషయాల్ని సాహిత్యాన్ని అధ్యయనం చేస్తున్నవాళ్ళకి తెలియపరచాలన్న ఉద్దేశ్యంతో 'అధ్యయనం' ఈ కార్యక్రమాన్ని చేయడానికి నిర్ణయించింది. అందుకు ఈ రంగంలో అనుభవమున్న కుర్రా జితేంద్రబాబుగారిని ఈ కార్యక్రమానికి ఎంపిక చేసింది.

కుర్రా జితేంద్రబాబుగారు న్యాయశాస్త్రంలో డిగ్రీపట్టాపొంది ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో న్యాయవాదిగా చాలాకాలంపాటు పని చేశారు. ప్రస్తుతం న్యాయవాదవృత్తిని కాదనుకొని సాహిత్యాధ్యయనం, పరిశోధనలో నిమగ్నమయ్యారు. కుర్రా జితేంద్రబాబుగారు మరికొందరు కలిసి డాక్రి(దక్కన్ ఆర్క్యలాజికల్ కల్చరల్ రీసర్చ్ ఇన్స్ట్యూట్)ని స్థాపించి పుస్తకాల ముద్రణను కర్తవ్యంలా పెట్టుకున్నారు. ఇప్పటివరకు 30 పుస్తకాల్ని ప్రచురించడం ఇందుకు నిదర్శణం. ప్రస్తుతం కుర్రా జితేంద్రబాబుగారు డాక్రికి డైరెక్టర్‌గా పనిచేస్తున్నారు. అలాగే వేమన ఫౌండేషన్‌లో, సాలార్ జంగ్ మ్యూజియంలో సభ్యులుగా ఉన్నారు. ఇప్పటి వరకు 30 వరకు పుస్తకాలు ప్రచురించారు. వీటిలో కొన్ని స్వంత రచనలు కాగా, కొన్నింటికి సంపాదకుడిగా, మరికొన్నింటికి పరిష్కర్తగా, మరికొన్నింటికి వ్యాఖ్యాతగా, మరికొన్నింటికి అనువాదకుడిగా ఉన్నారు. వాటిలో నిజాం రాష్ట్రాంధ్ర మహాసభలు(రెండు సంపుటాలు), రసేంద్రమంగళం, వ్యవహారచింతామణి, మానవల్లికవి – రచనలు, దండవివేకం మొదలైనవి మచ్చుకు కొన్ని. ఇప్పటివరకు 700 వ్యాసాల వరకు రాశారు. అనేకానేక ఉపన్యాసాలిచ్చారు. రెండు, మూడు భాషల్ని నేర్చుకోవడమే గగనమవుతున్న నేటి కాలంలో ఎనిమిది భాషల్ని నేర్చుకొని అష్టభాషాప్రవీణుడు అనిపించుకోవడంతోపాటు సంస్కృతం నుండి ఆంగ్లంలోకి, ప్రాకృతం నుండి ఆంగ్లంలోకి ఇలా ఒక భాషనుండి మరో భాషలోకి పుస్తకాలు అనువాదం చేశారు. సంస్కృత, మరాఠీ భాషల్లో వ్యాసాలు రాశారు. రచయితగా, పరిష్కర్తగా, అనువాదకుడిగా, వ్యాఖ్యాతగా, పరిశోధకుడిగా ఇలా జ్ఞానాన్వేషణలో రోజుకో కొత్త రూపంగా ఆవిష్కృతమవుతున్నారు. ఈ అంశాల్లోనేకాక సంగీతం, నాట్యం, చిత్రలేఖనం తదితర రంగాల్లో కూడా ప్రావీణ్యులు. శ్రద్ధ, ఆసక్తి, పట్టుదల ఉంటే మనం చదివిన చదువుకు ఎంచుకున్న రంగానికి సంబంధంలేకున్నా ఆ రంగంలో నిష్ణాతులు కావచ్చు అన్న విషయానికి నిలువెత్తు నిదర్శనం. ఒక సంస్థ చెయ్యలేని పనిని వ్యక్తిగతంగా తెలుగు సాహిత్యంపై ఉన్న మమకారంతో ఎన్నో పుస్తకాలు రాయడంతోపాటు కొత్త సిద్ధాంతాల్ని, వాదాల్ని చేస్తూ సాహిత్యాన్ని మరింతగా పరిపూర్ణం చేస్తున్నారు.

**వక్త: కుర్రా జితేంద్రబాబు** (డైరెక్టర్, డాక్రి)

**ప్రారంభోపన్యాసం: డా. బి. భుజంగరెడ్డి** (అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలుగు శాఖ)

**స్థలం: అంబేద్కర్ ఆడిటోరియం** | **హైదరాబాద్ విశ్వవిద్యాలయం**

**తేది: 06/11/2015; శుక్రవారం** | **సమయం: సాయంత్రం 4:30 గం.లకు**

## అధ్యయనం

## తెలుగు కళాసాంస్కృతిక సాహిత్య చర్చావేదిక

హైదరాబాద్ విశ్వవిద్యాలయం – గచ్చిబౌలి, హైదరాబాద్.

ఫోన్: 9493971126, 9441006418, 9963709032

అందరికీ ఇదే మా సాదర ఆహ్వానం